





నా మెయిల్:
darlahcu@gmail.com

https://vrdarla.blogspot.com/

"వినయం బానిసత్వమైతే /జీవితం/ మోయలేనంత బరువు"

నా ఫోను నెంబరు:
9182685231



Darla
vrdarla

SomeEssays

"Voice of a Dalit: The Poetry of Darla Venkateswara Rao, Publis

26 June, 2021

# దార్ల మాట శతకం ఆవిష్కరణ సభ

ఆచార్య దార్ల వెంకటేశ్వరరావు గారి **దార్ల మాట శతకం ఆవిష్కరణ** సభ, కర్నూలు లో శనివారం (26.6.2021) జరిగింది. శ్రీశైలం ప్రాజెక్టు స్పెషల్ కలెక్టర్ రామస్వామి ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. పుస్తకాన్ని గణేష్ దినపత్రిక సంపాదకుడు శ్రీ కొత్తూరు సత్యనారాయణ గుప్త గారికి అంకితం చేశారు.

UoH Herald
Loading...

Labels
దార్ల (461)
విద్యా సమాచారం (182)
పత్రికలు (137)

వ్యుయ్మూల్యాంక
నం
తెలుగు కథ
(2015) విమర్శ
అతడు అడవిని
జయించాడు'



## సమకాలీన సమాజానికి దర్పణం దార్లమాట శతకం

నేటి తరానికి రేపటి తరానికి దార్ల మాట శతకం ఆదర్శప్రాయంగా మార్గదర్శకంగా ఉంటుందని శ్రీశైలం ప్రాజెక్టు స్పెషల్ కలెక్టర్ రామస్వామి తెలిపారు శనివారం ఉదయం తన చాంబర్లో సెంట్రల్ యూనివర్సిటీ ప్రొఫెసర్ దార్ల వెంకటేశ్వరరావు రచించిన దార్ల మాట శతకం పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ గతంలో లో పద్యాలు కొందరికే పరిమితమవుతూ వచ్చాయని కాలక్రమేణా నేటి కవులు పద్యాలను కూడా సులభతరంగా వాడుక భాషలో వ్రాయడం సంతోషదాయకం అన్నారు. వెంకటేశ్వర రావు రచించిన శతకం లోని పద్య ప్రక్రియ జోరు నేటికీ కొనసాగుతుందన్నారు. శతకంలో ఒక పద్యానికి మరో పద్యానికి సంబంధం ఉండదన్నారు. తెలుగు సాహిత్యాన్ని ప్రోత్సహించడం నూతన కవులకు అవకాశం కల్పించడం ముఖ్యం గా కవయిత్రుల కోసం జాతీయస్థాయిలో లో సమావేశాలు సభలు నిర్వహించడం కొత్తూరు సత్యనారాయణ గుప్త కే సాధ్యమన్నారు. ఆయన చేసిన సాహిత్య సేవను గుర్తించి దార్ల వెంకటేశ్వరరావు గారు ఈ పుస్తకాన్ని అంకితం ఇవ్వడం అభినందనీయమన్నారు. సమకాలీన సమాజంలో కనిపిస్తున్న వివిధ అంశాలను సరళమైన పదాలతో పద్యాలు రాయడం జరిగిందన్నారు. దార్ల వెంకటేశ్వరరావు సాహిత్య లోకానికి సేవలు అందిస్తున్నందుకు ఆయన్ని అభినందించకు తప్పదు అన్నారు. వివిధ అంశాలను నేటి సమాజంలో గమనించి, పరిశీలించి, స్పందించి, వాటిని చిన్న చిన్న పద్యాలు గా వర్ణించడం మెచ్చుకోదగ్గ విషయమన్నారు.మనిషి ఆకాశ మంత ఎత్తు ఎదిగినా, కాలుమోపినా, ఎన్నో ఘనకార్యాలు చేసినా, బుద్ధి మాత్రం మనిషి కి మారడం లేదన్నారు. అటువంటి మానవ మనస్తత్వాన్ని కవి చక్కగా పట్టుకోగలిగారన్నారు. అఖిలభారత సాహితీ కళాకారుల సంస్థ వ్యవస్థాపకులు కొత్తూరు సత్యనారాయణ గుప్తా మాట్లాడుతూ సాహిత్యం సరళంగా వాడుక భాష తో కవితలు పద్యాలు వచ్చినప్పుడే ప్రజలు ఆదరిస్తారని, సాహిత్యం ఎక్కడ ఉంటుందో ఎక్కడ ప్రాధాన్యత ఇస్తారో ఆ ప్రాంతం అభివృద్ధి బాటలో పయనిస్తుందని ఆయన తెలిపారు. *దార్ల మాట శతకం* తనకు అంకితమివ్వడం తన పూర్వజన్మ సుకృతం గా తాను భావిస్తున్నానని ఆయన తెలిపారు. పద్యాలు మనుషుల్లో నైతిక విలువలను పెంచుతాయని ఆయన తెలిపారు. ప్రభుత్వం

కొన్ని కవితలు

నిద్రరాని ప్రతి
అర్థరాత్రీ
ఆకాశంకేసి
చూసినప్పుడల్లా
నాఒంటరితనా

Total Pageviews

దళిత (128)
Darla Bio note (121)
జాతీయ సదస్సు (111)
సమకాలీనం (104)
కవితలు (94)
Darla Bio note దార్ల (73)
నా డైరీలో ఓ రోజు (71)
వ్యాసాలు (70)
అభిప్రాయాలు (67)
చర్చ (65)
సమీక్షలు (59)
పత్రికలు దార్ల (56)
ప్రకటనలు (56)
సూర్య (45)
పుస్తకం (30)
Darla Bio note Darla Photo for Media (23)

కూడా సాహిత్య సభలను సమావేశాలను నిర్వహించాలని ఆయన ఈ సందర్భంగా కోరారు. ఈ సమావేశంలో కవులు హరిశ్చంద్రా రెడ్డి, శ్రీమతి నాగజ్యోతి, దళిత నాయకులు లు త్యాగరాజు, బీసీ సంఘం అధ్యక్షులు శేష ఫణి, ఎస్ టి సంఘం అధ్యక్షులు రాజు, కాంగ్రెస్ సీనియర్ నాయకులు వెంకటయ్య తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా కవులను శ్రీశైలం ప్రాజెక్టు ప్రత్యేక కలెక్టర్ రామస్వామి సన్మానించారు.

- 26.6.21   

## No comments:

Post a Comment

Newer Post | Home | Older Post

Subscribe to: Post Comments (Atom)

